# మహానుభావులు.



(రెండవ భాగము).

పుస్తకకర్త,
•
పత్రికలకర్త

శ్రీపాదలక్ష్మీపతిశాస్త్రి.

# మహానుభావులు.



(రెండవ భాగము)

పుస్తకకర్త, పత్రికటస్కరః

శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రి.

మొదటి కూర్పు 1000

1931



# చిన్న మనవి.

భాషాభిమానులారా!

భాషాప్రాసాద మెక్కఁదలచిన పిల్లలకు వారి బుద్ధిశక్తుల కనుకూలమగునట్లు కొన్ని పుస్తకసోపానములు నిర్మించి ప్రకటింపఁదలఁచితిని.

ఆసోపానములకు వలయు పదసామగ్రిలో మహానుభావుల చరిత్ర మను సుధారసము సమ్మేళనము చేసిన యెడల మిగుల బాగుగా నుండు నని యట్లు గావించితిని.

కావుననే యీసోపానములకు "మహానుభావులు" అను పేరుపెట్టితిని.

పిల్లల తరగతుల ననుసరించి యివి యుపయోగించినయెడల బాలురు సులభముగాఁ బ్రాసాదమెక్కఁగలరు. ఆసోపానములలో నిది రెండవది.

ఇట్లు,

భాషాసేవకుఁడు,

శ్రీపాద లక్ష్మీనృపతిశాస్త్రి.

---

# విషయములు.

ఓ మ్.

# మహానుభావులు.

---

మహానుభావు లని ప్రసిద్ధి కెక్కిన వారెల్లరును బాల్యమున మీావలెనున్నవారే. వారి విద్యవలనను, వారిమంచి నడవడి వలనను, పరోపకారబుద్ధిచేతను, వారు మహానుభావు లనిపించుకొనిరి. లోకమునకో, స్వదేశమునకో, స్వజాతికో, స్వకుటుంబమునకో గలిగిన కష్టములను నివారింపఁజేసి సుఖస్థితి గలిగించుటకుఁగాని యున్నస్థితికంటె మంచిస్థితి గలిగించుటకుఁ గాని యత్నించువారు మహానుభావులు.

వారు తమసుఖమును వదలుకొని పాటుపడవలసి యుండును. కొన్నికష్టములకులోనుగావలసి యుండును. ఒక్కొకపుడు తమప్రాణములుగూడ నర్పింపవలసివచ్చును. అట్టికష్టములకు సిద్ధపడి పరోపకారము గావించినవారే మహానుభావులు.

పశుపక్ష్యాదులు తమపొట్ట నిండించుకొనుటకును, గూఁడుగట్టుకొనుటకును, రాత్రియుఁ బగలును యత్నించును. మనుష్యులలోతినుటకుఁ దిండికిని నివసించుటకింటికిని, కట్టుకొనుటకై బట్టకొఱకును యత్నింతురు.

కొందఱు అంతతో సంతృప్తిపడక నిలువకై ధనము సంపాదింప యత్నముచేయుదురు.

పరులకు బాధ కలుగకుండ యత్నించువా రుత్తములు. పరులను బాధించి ధనము సంపాదించువా రధములు. పరులఁ బీడించుటకంటెఁ బాపములేదుగదా. పరుల యుపకారముకొఱకు తన ధనమును దన సుఖమును విడుచువారు మహానుభావులు.

లోకమంతయు నొకకుటుంబము. జగత్కర్తయే మనకు జనకుఁడు. లోకములోని వారందఱును సోదరులు. సమస్తప్రాణులందును సమభావమే యుండవలెను. ఇతరభేదములు కల్పితములు. అని నిశ్చయించి ఆభావమాచరణమునఁ జూపువారు మహానుభావులు.

లోకక్షేమమున కేర్పడిన ధర్మముదాఁటక సంచరించువా రెల్లరును మహానుభావులే.

సర్వము భగవత్కళామయమని యెంచి భగవంతుని ధ్యానించుచు బ్రహ్మానంద మనుభవించువారు మహానుభావులలో మహానుభావులు.

సుఖాభిలాష ధనాశలు విడిచినఁగాని ఘనకార్యములు సాధింపలేరు. అదియే స్వార్థత్యాగము. స్వార్థత్యాగులే మహానుభావులు.

అట్టి మహానుభావుల చరిత్రము లొక్కొక్క కాలమున నొక్కొక్క రీతిగా నుండును. వానిలోఁ గొన్ని నేఁటికాలమున సత్యములని నమ్ముటకుఁగూడ నవకాశము లేనట్లు గనఁబడును.

అవి సత్యము లనుకొన్నను, అసత్యము లనుకొన్నను అందలి గుణములు గ్రహించుట మనకు విధి. దాని ననుసరించి మన ప్రవర్తన యేర్పఱచికొనుటయే ముఖ్యము. అదియే మహానుభావులచరిత్రములు చదువుటకు ఫలము. దానివలనఁ గ్రమముగా మహానుభావులలో నొక్కఁడయినవాఁడే ధన్యుఁడు.

మహానుభావులలోఁ గొంద ఱాగర్భశ్రీమంతులు, కొంద ఱాగర్భదరిద్రులు. కొందఱు ఛాందసులు, కొందఱు చండాలురు. కొందఱు స్త్రీలు, కొందఱు పురుషులు. కొందఱు వృద్ధులు, గొందఱు బాలురు.

అందఱును ఏదో మహాగుణసంపత్తి గలవారే. భగవదంశము గలవారే. వారే మహనీయులు.

---

# కచుఁడు—విద్యార్థి.

పూర్వము కశ్యపుఁడనువానికి నదితియనియు, దితియనియు నిద్దఱు భార్యలుకలరు. అదితికిఁ బుట్టినవారాదిత్యులనియు, దితికిఁ బుట్టినవారు దైత్యులనియుఁ బ్రసిద్ధి. ఆదిత్యులు మంచి నడవడిగలవారు. ఇతరులకు బాధగలుగకుండఁ జూచువారు. కావున వారిని దేవతలని యందఱును ననుచుండువారు. దైత్యులకు దుడుకుఁదనమెక్కువ. ఇతరులకు బాధకలిగించుటయే వారికొకయాట. కాఁబట్టి వారిని రాక్షసులని యందఱును ననుకొనుచుండిరి.

ఆదిత్యులును దైత్యులును సవతియన్నదమ్ములు. వారొండొరులను బాధించుచుండిరి. ఆరెండుతెగలవారికిని దఱుచు యుద్ధములు జరుగుచుండెడివి. పాములకును ముంగిసలకును విరోధము సహజమయినట్లా రెండు తెగలవారికి విరోధము సహజమయియుండెను.

దైత్యులకు గురువు శుక్రాచార్యుఁడు. ఆదిత్యులకు గురువు బృహస్పతి. ఆగురువులయొద్ద వారు శస్త్రములు నేర్చుకొనుచుండువారు. ఆగురువులు క్రొత్తక్రొత్తవిద్య కనిపట్టుచుండిరి. అప్పటికి దేవతలకుఁగూడ

మనవలెనే చావుబ్రతుకులున్నవి. శుక్రాచార్యుఁడు చచ్చిపోయినవారిని మరల బ్రతికించువిద్య కనిపట్టినాఁడు. ఆవిద్య పేరు మృతసంజీవిని. యుద్ధమున రాక్షసులలో నెవ్వరైనను జచ్చిపోయినయెడల శుక్రాచార్యుఁడు తన విద్యచే వెంటనే బ్రతికించుచుండువాఁడు.

దేవతలదిచూచి చాల భయపడిపోయిరి. దానికి బ్రతిగా నేవిద్యయును గనిపట్టలేకపోయిరి. ఆమృతసంజీవినీవిద్యయును దమలో నెవరికిని దెలియకపోవుటచే నేమిచేయవలయునో సరిగాఁ దెలియక విచారించుచుండిరి. తుదకుఁ దమలో నెవ్వడయినను శుక్రునొద్దకు బోయి యాతని మెప్పించి యావిద్య సంపాదించి రావలెనని యాలోచనచేసిరి.

బృహస్పతికుమారుఁడగు కచుఁడు దానికిఁ దగినవాఁడని నిర్ణయించుకొని కచునితో నిట్లు చెప్పిరి. "మనలో శౌర్యము బలముఁ గలవారెందఱో కలరు. యుద్ధమునఁ బడి చచ్చిపోయినచో యమపురమునకుఁ బోవలసినదే గాని మరల బ్రతికి లేచుసాధనము లేదు. రాక్షసులలోఁ జచ్చినవారు మృతసంజీవినిచే మఱల బ్రతికి లేచుచున్నారు. మనబలము క్రమముగా నశించుచున్నది. శత్రువులబలమునకుఁ దఱుఁగు లేదు. మనలో నెవ్వరైన

నావిద్య శుక్రునివలన నేర్చుకొనివచ్చి దేవతలను రక్షింప వలయును. దానికి నీవే తగినవాఁడవు. బాలుఁడవు. రూపవంతుఁడవు. విద్యలలో నారితేరినవాఁడవు. కట్టు దిట్టమయినవాఁడవు. శుక్రున కాతనికుమార్తెయందె కక్కువప్రేమ. ఆమె చెప్పినట్లాతఁడు చేయును. నీవామె మనస్సు సంతోషించునట్లు నడచుకొనవలెను. నీవే యీ గొప్పపని సాధింపవలెను. ఇతరుల వశముగాదు. ఇది దేవతలందఱకును క్షేమకరము. నీవు కొన్నికష్ట ములు పడవలసివచ్చును. వానినన్నిటిని సహించి విద్య సంపాదింపవలయును"

కచుఁ డామాటలువిని యెన్ని కష్టములుపడినను మృతసంజీవినీవిద్య సంపాదించి తన జాతికి మరణము తప్పింపవలయునని నిశ్చయించుకొని వేదాధ్యయనము వంకపెట్టుకొని శుక్రాచార్యునొద్దకు వెళ్ళి నమస్కరించి వినయముతో "నేను బృహస్పతికుమారుఁడను. నాపేరు కచుఁడందురు. తమయొద్దకు శిష్యభావముతో వచ్చితిని. నన్ను శిష్యునిగా గ్రహింప వేఁడెదను. తమకు శుశ్రూ షచేయుచుందును." అని పలికెను.

శుక్రుడు కచుని సుకుమారత్వముచూచి, మధు రములగు మాటలువిని, యాతనిముఖమందుఁ బ్రకటిత మయియున్న శాంతస్వభావమునకు సంతసించి, బృహ

స్ఫతివచ్చినట్లే యాలోచించి, యాతని నాదరించి శిష్యు
నిగా నేర్పఱచుకొనెను.

అప్పటినుండియు నతఁడు శిష్యుఁడుగానుండెను.
గురువుగారేదియయినను బనిచెప్పినచోఁ "గొంచెముసే
పుండిచేసెదను" అనియనక యాజ్ఞాపించిన తత్క్షణమునసే
పని నెఱవేర్చుచుండువాఁడు. వినయతో సంచరించు
చుండువాఁడు. మనస్సులోనొకటి, చెప్పెడిదియొకటి, చే
యునది మఱియొకటియుఁగాకుండఁగాఁ ద్రికరణశుద్ధిగా
మనస్సులోఁ దోఁచినదంతయుఁ బైకిఁజెప్పుట, చెప్పిన
దంతయుఁ జేయుటయే త్రికరణశుద్ధి యనఁబడును.

దేవతలు చెప్పినట్లు శుక్రాచార్యుని కూఁతురగు
దేవయానికి విధేయుఁడయి మంచిమాటలతో నామెకు
సంతసముఁ గలిగించుచు నామెకిష్టమగు పూవులు పండ్లు
తెచ్చి యిచ్చుచుండువాఁడు. గురువుగారికిని గురుపుత్రి
కకును నాతనియం దెంతయో ప్రేమగలిగెను.

రాక్షసులు శుక్రాచార్యునకుఁ బ్రియశిష్యుఁడగు
కచునిజూచి యోర్వలేకుండిరి. పరుల గౌరవముచూచి
సంతోషించు వారరుదుగానుందురు. ఓర్వలేనివారే
యెక్కువమంది.

వనములోఁ గచుఁడు హోమధేనువులను గాచు చు నొంటరిగానున్న సమయమున నతనియం దసూయగల రాక్షసులు "మాశత్రువుల గురువగు బృహస్పతికిఁ గుమారుఁడవు. నీవు మాకు శత్రువవు. నీతో మాకు స్నేహమేమి?" అని లేనిపోనికారణములు చూపి కలహము తెచ్చిపెట్టి కచునిఁగొట్టి చంపి చెట్టుఁగొమ్మనకు వ్రేలాడఁగట్టి వెళ్ళిపోయిరి.

ఆవులు శుక్రాచార్యునింటికి వచ్చినవి. వానితోఁ గచుఁడు రాలేదు. వానిరాకకుఁ బ్రతిదినము సాయంకాల మెదురుచూచుచుండు దేవయాని నాఁడును నెదురు చూచుచుండెను. కచుఁ డెంతసేపటికిని రాలేదు. దేవయాని మనస్సులోఁ బరిపరివిధముల నాలోచించి యేమియును తోఁపక తండ్రియొద్దకు వెళ్ళి "తండ్రీ! నేఁ డేకారణముననో కచుఁడు రాలేదు. ధేనువులు వచ్చినవి. హోమములు చేయుటయయినది. ప్రొద్దుపోయినది. అతఁ డింకను రాలేదు. క్రూరమృగములవలనఁగాని రాక్షసులవలనఁగాని యేమయిన నాపదనొందెనేమో యని భయముగా నున్న దనియెను.

"శుక్రుఁ డదివిని దివ్యదృష్టితోఁజూచి కచుని రాక్షసులు చంపి చెట్టునకు వ్రేలాడఁగట్టుట గ్రహించి వానిని

మరల బ్రతికించి తీసికొనివచ్చుటకై మృతసంజీవినీశక్తిని బంపఁగా నాశక్తి తక్షణము వెళ్ళి విగతజీవుఁడగు కచుని బునర్జీవితునిఁ జేసి తీసికొనివచ్చెను. దేవయానియు శుక్రాచార్యుఁడును జాల సంతసించిరి. రాక్షసులకు నెంతయో కష్టముగానుండెను. అదిరాక్షసుల కిష్టముగానుండదని యెఱిఁగియు శుక్రాచార్యులు ప్రియశిష్యునియందలి వాత్సల్యముచేతను, దేవయానిమాటయందలి యాదరముచేతను నట్లు కచునిఁ బునర్జీవితునిఁ జేసెను. పగఁబూనినరాక్షసు లెట్లయినను బ్రాణములు తీయుదురను భయమున్నను దానుబూనినవని నెఱవేర్చు దీక్షతోఁ గచుఁడు జంకక యచ్చటనేయుండెను. రాక్షసులు కచుని బాధింప సమయమును గనుపెట్టి చూచుచునే యుండిరి. కచునినొంటరిగా నుండనీయక దేవయానియును శుక్రాచార్యుఁడును గాచుచునేయుండిరి.

ఒకనాఁడు కచుఁడు పువ్వులు దీసికొనివచ్చుటకయి యడవికి వెళ్లెను. ఆసమయము కనిపట్టి రాక్షసులు వాని నరణ్యమధ్యమునఁ జంపివేసిరి. ఆతని కళేబరము నెచ్చట నయినను బాఁతివేసినను బాతిపెట్టినను శుక్రాచార్యుఁడు మరల బ్రతికించి తీసికొనివచ్చును గావున దహనముచేసెదమని యాలోచించి తగులఁబెట్టి

భస్మముచేసిరి. శుక్రాచార్యు లాభస్మము నయినను మరల జీవింపఁ జేయునేమోయని యెంచి యాభస్మము శుక్రుఁడు త్రాగు కల్లులోఁ కలిపియిచ్చిరి. శుక్రాచార్యుఁడు త్రాగివేసి మదమత్తుఁ డయ్యెను. ఇంకఁ గచుని బ్రతికించుట యసంభవము. బ్రతికించినను బైకెట్లు వచ్చును? కావునఁ గచుఁడు పూర్తిగా నశించెనని యెంచి రాక్షసులు సంతసించిరి.

కచుఁడు రాఁదగినసమయమునకు రాకపోవుట చేత దేవయాని యాతని కెట్టి యాపద వాటిల్లెనోయని దుఃఖించి సురాపానమున నొడలెఱుఁగని తండ్రిమొద్దకుఁబోయి "తండ్రీ! కచుని రాక్షసులు చంపిరేమో? నేఁ డింకను రాలేదు. అయ్యో! ఎంతసుకుమారుఁడా బృహస్పతికుమారుఁడు." అని పలువిధముల వాపోయెను.

శుక్రుఁడు "తల్లీ! వానికై నీకింతవిచారమేల? రాక్షసు లందఱును వానియెడఁ బగఁబూనియున్నారు. ఎన్నిమాఱులు మరల బ్రతికించినను వా రాతని జంపకుండఁగ విడువరు. మనకేల? అతఁడు సద్గతినిఁ బొందుఁగాక" అనిచెప్ప దేవయాని యి ట్లనియెను.

" మహాత్మా ! ఎంతమాట సెలవిచ్చితిరి ! అంగిరసునిమనుమఁడు, బృహస్పతి కుమారుఁడు, మీకు శిష్యుఁడు, బ్రహ్మచర్యాశ్రమమందున్న సుకుమారుఁడు. అట్టి సుందరాకారుని నిష్కారణముగా రాక్షసులు చంపినపుడు దుఃఖింపక యెట్లుందును ? ఆతని జూచినఁగాని తిండి తిన నొల్లను. " అని యేడ్వఁగా మనమునఁ బ్రసన్నుఁడయి దివ్యదృష్టితోఁ బరిశీలించిచూచి యేలోకమునను గచునిగానక చిట్టచివరకుఁ దనగర్భమున భస్మము యుఁడయి యుండుట దివ్యదృష్టితోఁ దెలసికొని యసురులు చేసిన దుర్మార్గకృత్యమును గ్రహించి వారినననేల? సురాపానముచేతఁగదా వాని భస్మము ద్రాగివైచితిని. అని ద్రాగుడువలనఁ గలిగినమోసమును గ్రహించి సురాపానము మహాపాతక సమమని నిషేధించెను.

"ఆ. వె. మొదటి పెక్కుజన్మములఁ బుణ్యకర్మముల్
పరఁగఁ బెక్కుసేసి పడయఁబడిన
యట్టి యెఱుక జనులకాక్షణమాత్రన
చెఱుచు మద్యసేవ సేయనగునె.

క. భూసురు లాదిగఁగల జను
లీసురసేవించి రేని యిదిమొదలుగఁ బా

పాసక్తిఁ బతితులగుదురు
చేసితి మర్యాద దీనిఁ జేకొనుఁడు జనుల్."

తనగర్భమున నున్న కచునిభస్మము మరల జీవింపఁజేయఁగా నందుండి కచుఁడు శుక్రునితో "గురువర్యా! మీదయవలన దేహమును జీవమును బొందితిని. మీయుదరమునుండి వెలువడు మార్గము దెలుపుఁడు." అని వినయముతో నడిగెను.

శుక్రుఁడు "కచా! నాయుదరమును జీల్చుకొని నీవు వెకిరావలయును. అప్పుడు గర్భము ప్రక్కలగుటచే మూర్ఛనందుదును. నన్ను నీవు బ్రతికింపుము. నీకిపుడే మృతసంజీవిని యుపదేశము చేసెదను. స్వీకరింపుము." అని మృతసంజీవినీవిద్య నుపదేశించెను.

కచుఁ డధికసంతోషమునుబొంది యావిద్యను గ్రహించి శుక్రునియుదరము భేదించుకొని వచ్చెను. శుక్రుఁడు మూర్ఛితుఁడయి పడియుండెను. కచుఁడు గురుకళేబరమునుజూచి మృతసంజీవినీశక్తి నుపయోగించి మరల బ్రతికించెను.

కచుఁడు మృతసంజీవిని కేవల ముపదేశమాత్రమున గ్రహించి పోవుటయేగాక యనుభవపూర్వకముగా గురుకళేబరము బ్రతికించి ధన్యుఁడనయితి నని సం

తోషించెను. రాక్షసులు దుర్బుద్ధితోఁ దనకపకారము గావించినను నది యుపకారముగాఁ బరిణమించినందుల కును, దాను వచ్చినపని నెఱవేఱినందులకును జాల సంతసించెను.

తర్వాతఁ గొంతకాలము గురుశుశ్రూష చేయు చుఁ గాలము గడపి యొకనాఁడు గురుని యనుమతినొం ది వెడలఁదలఁచి దేవయానితోఁ దన ప్రయాణవిషయ మును దెలిపెను.

చిరకాలమునుండియుఁ గలసి స్నేహముతోనున్న యామె యాతని నెడఁబాసి యుండఁజాలక యిట్లనియెను. "నీవు బ్రహ్మచారివి. విద్యావంతుఁడవు. సుశిక్షితుఁడవు. నేనును నవివాహితను. విద్యావతిని. పితృశిక్షితను. నా మనమున నిన్నిదివఱకే వరించియుంటిని. నన్నుఁ బరి గ్రహింపుము. ఇది నాతండ్రికిని నిష్టమయినదియే. నిన్ను విడువఁజాలను."

కచుఁడు మనమున విషాదమునొంది దేవయానీ! నీవు గురుపుత్రికవు. నాకు సహోదరివి. నీవట్లు కోరుట తగునా?" అని యామె కోరిక నిరాకరింపఁగా దేవ యానికిఁ గోపము కలిగెను.

అంత నామె "కచా! నామనోరథము నీవు విఫలముగావించితివిగాన నీకు నాతండ్రియుపదేశించిన మృతసంజీవినీ విద్య విఫలమగుంగాక" యని శపించెను.

కచుండు ధర్మమార్గము తప్పుట కిష్టపడక "దేవయానీ! సోదరీ! ధర్మమార్గమును దాంటనివాండ నగు నాకు నీశాపమున మృతసంజీవిని పనిచేయకపోయినను నాచే నుపదేశము పొందినవారికిం బనిచేయుంగాక"యని పలికి దేవలోకమునకుం బోయెను.

దేవతలందఱును మహానందమును నొంది వాని నాదరించిరి. కచుం డావిద్య దేవతల కుపదేశించెను. తా నెన్నియోపాట్లుంబడి సంపాదించిన విద్య పదిమందికి నుపదేశించి లోకహితముచేసిన కచుని జన్మము మిగుల ధన్యము.

---

# ప్రహ్లాదుఁడు-సమాజభక్తి.

---

రాక్షసరాజగు హిరణ్యకశిపునకుఁ బ్రహ్లాదుఁడను కుమారుఁడుండెను. ఆతఁడు తోడిబాలురతోఁపాటు చురుకుగా నుండక మాంద్యమున్న వానివలెఁ బైకిఁ గనఁబడుచుండెను. ఆతని కయిదేండ్లు వచ్చినవి. చిన్నతనపుఁ జిల్లరిచేష్టలు లేక పెద్దలు సత్కాలక్షేపము చేయుచోటఁగూర్చుండి యేదియో యాలోచించుచుండెడివాఁడు. అప్పుడప్పుడు శ్రీహరియని భగవంతుని నామము స్మరించుచుండెడి వాఁడు.

రాక్షసరాజతనిరీతిఁజూచి యాతనిని జదివించినఁ దెలివితేటలు కలుగునని యెంచి చదివింప గురువులొద్ద నప్పగించెను. ప్రహ్లాదుఁడు గురువులు చెప్పిన చొప్పున చదువుచుండెడివాఁడు. కాని తనకు సహజముగానున్న బుద్ధిని వృద్ధిచేసికొన నావిద్య లుపయోగించుకొని యేపనిచేయుచున్నను, యేదియో మనమున చింతించుచు 'శ్రీహరీ'యని పయి కుచ్చరించుచుండెడి వాఁడు.

తండ్రి యొక్కనాఁడు కుమారుని బిలిపించి దగ్గఱకుఁజేర్చి ముద్దాడి "కుమారా! విద్యలన్నియు నేర్చితివి

గదా ! నీమనస్సునకు మేలు అని తోఁచిన విషయము ను తెలుపు"మనియెను. ప్రహ్లాదుఁడు 'శ్రీహరీ'యని భగవన్నామము స్మరించుచునే "తండ్రీ ! చావుబ్రదు కులతో నుండు నీ సంసారమున మునుఁగక సర్వవ్యా పకుఁడగు శ్రీహరిని నమ్మి ప్రపంచమంతయు నాతని దివ్య కళాస్వరూపమని యెంచుటయే మేలు" అని ప్రతి వచనమిచ్చెను.

ఆమాటలు విని తండ్రి మిగులఁగోపించి 'నాయ నా ! ఈబుద్ధి నీకే తోఁచెనా ? ఇతరు లెవరైన బోధిం చిరా ? దేవతలను జయింపవలెను. దేవరాజసిం హాసన మాక్రమించుకొనవలెను. మునీశ్వరుల బాధిం పవలెను. అట్లుగాక హరీ గిరీ యనుచు రాక్షసవిరోధిని దలఁచెదవేల" అని మందలించెను.

ప్రహ్లాదుఁడు ప్రక్కనున్న చండామార్కు లను గురువునిఁజూచి "జ్ఞానవంతులకు వీరువారను భేదము లేదు గదా! సర్వవ్యాపకుఁడగు పరమేశ్వరునకు నమస్కరిం చెదను. అయస్కాంత మినుము నాకర్షించినట్లు నామన స్సును శ్రీహరి సన్నిధి యాకర్షించుచున్నది. దానినివీడి యితరము జేరనేరకున్నది. కారణమేమో నాకుఁదెలి యదు." అనెను.

ఆమాటలువిని రాజపురోహితుఁడు ప్రహ్లాదుని "అయిదేండ్ల బాలుఁడవు, వ్రేలెడంత లేవు. మేము చెప్పి నవిషయములు దెలుపక యేదేదో ప్రసంగించి మాకు తలవంపులు దెచ్చుచున్నావు. వంశాచారముల విడఁవ రాదు." అని తిరస్కరించి "రాజేంద్రా! ఎన్నివిధములఁ జెప్పినను రాక్షస విరోధియగు శ్రీహరిని స్మరింపక మానఁడు. వీనిని గట్టిగఁ గొట్టి శిక్షించినఁగాని తిన్నని త్రోవకురాఁడు. వీనిని దండించుటకు అనుజ్ఞనిండు." అని ప్రహ్లాదుని కఠినముగ దండింప రాజానుమతిని బొంది ప్రహ్లాదుని దనవెంట గొనిపోయి రాక్షసనీతి బోధించు చుండెను. శత్రువులగు దేవతల హింసింపవలయును. ధన మార్జింపవలయును. సమస్త సుఖముల ననుభవింపవలయు ను. మోక్షము గీక్షము మన కక్కఱలేదు. అని బోధింపఁ బ్రహ్లాదుఁ డాబోధనములఁ జెవినిఁబెట్టక పరమేశ్వరుని ధ్యానించుచుండెను.

మరికొంతకాలమునకు గురువు ప్రహ్లాదుని దం డ్రియొద్దకుఁ దీసికొనిపోయి "రాజా! నీకుమారుని శిక్షిం చితిమి. శత్రుపక్షము మానినాఁడు మననీతినేర్చినాఁడు ఈతనివిద్యాబలము పరీక్షింపుము" అనుచు రాజకుమారు నిఁజూచి "రాజకుమారా! మీతండ్రికి నమస్కరింపు"

మనెను. ప్రహ్లాదుఁ డట్లు నమస్కరించి నిలఁబడఁ దండ్రి కుమారునిఁ గౌఁగలించుకొని తొడలమీఁద నుంచుకొని ముద్దుపెట్టుకొని "కుమారా! ఎంతకాలమైనది. గురువు లేమిచెప్పిరో చూతము. నీకునచ్చినవిషయము దెలుపుము. అని బుజ్జగింపగఁ కుమారుఁ డిట్లనియెను.

"సీ. కమలాక్షునర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణునాకర్ణించు వీనులు వీనులు
మధువైరిఁ దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తమునిమీఁది బుద్ధి బుద్ధి

తే. దేవదేవునిఁ జింతించు దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడు గురుఁడు గురుఁడు
తండ్రి! హరిఁజేరుమనియెడి తండ్రి తండ్రి."

కావున హరిని నమ్మియుండుటయే భద్రమని తలఁచెదను. అని వెఱపెఱుఁగక పలికెడు కొడుకుపలుకులు చెవులకు ములుకులై నాటఁ 'గోపోద్రేకముతో

గురువుని జూచి, "నీవు చెప్పిన చదు విదియా? ఎంతమో సపోయితిని. నీవు యథార్థపు బ్రాహ్మణుఁడవా?" అని దూషించెను. గురువు మిగుల భయమునొంది "అయ్యా మావలనఁ దప్పులేదు. నీకుమారున కిది సహజబుద్ధియే కాని యితరులు చెప్పినదిగాదు. దీనికిఁ బ్రతిక్రియ మీారే చూడుఁడు. మాశక్యమైనదికాదు." అని తెలిపెను.

రాక్షసరాజు "కుమారా! గురువులుచెప్పని యీాబుద్ధి నీకెవ్వరుచెప్పిరి. వారిపేరు చెప్పుము" అనియ డిగెను. ప్రహ్లాదుఁడు "తండ్రీ యీాబుద్ధి యొకరుచెప్పిన వచ్చునా! ఏమిచ్చినను దొరకునదికాదు. అడవులకుఁ బోయి తపస్సుచేసినను హరిభక్తి లభించునదికాదు. సమస్తశాస్త్రములు శోధించితిని. వేయేల సంసారసముద్రమును దాఁటుటకు శ్రీహరిభక్తియే నావ"యని పలుకుకుమారుని ఛీ! పొమ్మని తొడనుండి క్రిందికిఁ దోచి త్రైచి "వీఁడు పితృద్రోహి కులద్రోహి నాశత్రువుని దలఁచుచున్నాఁడు. వీని కెన్నివిధముల బోధించినను బుద్ధి రాలేదు. వీనినిఁ గట్టికొట్టి చంపుఁడు." అని భటుల కాజ్ఞాపించెను.

భటులు రాజును సంతసింపఁజేయుటయే ముఖ్య మనుకొని హృదయశూన్యులై యాతనిని శూలముల

తోఁ బొడిచిరి. గదలతో మోదిరి. కొరడాదెబ్బలెన్నియో తగిలించిరి. కొండచరియలపై నెక్కించి క్రిందికిఁ బడద్రోసిరి. పాములచే గఱపించిరి. విషముఁ బెట్టించిరి. ఎండలో నిలఁబెట్టిరి.

అదేమి శాంతమోగాని యెన్నివిధముల బాధపెట్టినను జలింపఁడు. 'శ్రీహరీ' యనుట మానఁడు. అది దేనిప్రభావమో కాని యెంతకొట్టినను దేహము నలఁగనైన నలఁగ లేదు. కత్తులతోఁ బొడిచినచోట రక్తము చిమ్మనైనఁ జిమ్మ లేదు. ముఖకాంతి యిసుమంతయుఁ దఱుఁగ లేదు. ముఖమున దైన్యము లేదు. శ్రమము గనఁబడదు. కొట్టినప్పుడు చేతులొడ్డనైన నొడ్డఁడు. అమ్మా యని తల్లినిఁ జేరఁబోఁడు. కావరే యని యెవరినిఁ జీరఁడు. తండ్రి ఘోరకృత్యముఁ జేయుచున్నాఁడని యనఁడు. తనలోనైన ననుకొనఁడు. సర్వాత్మకుఁడైన పరమేశ్వరునియందు చిత్తమును నిలిపి పరమానందమయుఁడై యుండెను. అట్టిసహనము, అట్టిశాంతి, అట్టి సర్వసమబుద్ధి, అట్టిద్వేషము లేమియుఁగల మహాత్ముల యెడ కఠినదండనములన్నియు వ్యర్థము లేగదా !!

హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదునిదివ్యశక్తి కాశ్చర్యపడి ఖిన్నుఁడై తలవంచుకొని తనలోఁ దా నిట్లనుకొనెను.

"నేను చేయించిన మారణోపాయములన్నియు వ్యర్థము లైనవి. పోనీ! వీని కేమైన మంత్రతంత్రములు తెలియునా? తెలియవు. ఓషధివిశేషము లెఱుఁగడు. మాయ లేదు. మర్మము లేదు. వీని కేదో దివ్యప్రభావమున్నది. ఇన్ని విధములఁ జంపఁజూచిన నాయెడ ద్వేషమైనఁ జూపఁడే. నేఁజేయు నిగ్రహము లనుగ్రహములనునఁట. ద్వేషబుద్ధి లేనివాని నేదియును బాధింపదనుట సత్యము కాఁబోలు. శాంతాత్మునితో విరోధము పెంచుకొనినవారికి నాశము కలుగునందురు. ఇది యెందులకు వచ్చినదో కదా!"

చెంతనున్న గురు వాతని విన్నఁదనముఁ జూచి "రాక్షసేంద్రా! నీ కీవిచార మేల? నీవు ముల్లోకముల జయించినవాఁడవు. మీ కుమారుఁ డెంతవక్రబుద్ధియైనను బెద్దలసేవచేఁ దిన్ననగును. మా తండ్రియగు శుక్రాచార్యుఁడు నేఁడు వచ్చును. బాలు నాతని కప్పగించితిరేని యాతఁడు మార్గమునకుఁ దీసికొనిరాఁగలఁడు.'' అని చెప్పెను.

రా జామాటలు విని "సరే! గృహస్థులకుఁ గావలసిన ధర్మము లుపదేశింపుఁడు." అని యాజ్ఞచేసి ప్రహ్లాదుని వారితోఁ బంపివేసెను.

శుక్రాచార్యుఁడును నాతని పుత్రుఁడును శిక్షవంచన లేకుండ ధర్మార్థకామములగుఱించి బోధించిరి. మో

తూ సక్తున కవి వ్యర్థములని ప్రహ్లాదుఁడు పెడచెవినిఁ బెట్టె ను. గురువులు దరిని లేనితఱినిఁ బ్రహ్లాదుఁడు రాక్షసబా లకులఁ బిలచి " బాలకులారా! మనగురువులు మనకు చేయుబోధనములు మిగుల బంధకములు. మనతోడిబా లురు మనయెదుట నెందఱు చచ్చుటలేదు. ఇట్టిదేహము ను బోషించుటకై పరుల బాధించి ధనము సంపాదింప వలయునా? ప్రాణి పూర్తిగ బ్రతికెనేని నూఱేండ్లు బ్ర తుకును. అం దర్ధభాగము నిద్రాదులందుఁ బోవును. మిగిలిన యేఁబదిలోను నిరువది వత్సరములు శైశవ, బాల్య, కౌమారములలోఁ గడచును. మిగిలిన ముప్పది వత్సరములును కాంతాకనకములందలియాశచే వ్యర్థమ గును. ఆయాశ ప్రాణములకంటెఁ బ్రియంబు. పట్టుపు రుగు తనగూటిద్వారమును తానే బంధించుకొని విముక్తి మార్గము గననట్లు కాంతాకనకాశతో గృహస్థుఁడు తన్ను బంధించుకొని ముక్తిమార్గము గనఁజాలఁడు. విము క్తిమార్గము గనుటకు హరిభక్తియే సాధనము. అట్టిహ రినిభజించి తరింతము." అని బోధింప వారందఱు హరి భక్తులైరి.

శుక్రాచార్యుఁ డదిచూచి బాలురు తనకులొంగ కుండుటచే రాజసన్నిధి కరిగి రాజుతో నిట్లనెను. "రాజా! నీకుమారుఁ డందఱకును శత్రుభక్తిబోధించి మనకు

వ్యతిరేకులుగఁ జేసినాఁడు. దానికిఁబ్రతిక్రియనీవే చేయవలయును. మావలను గాదు" హిరణ్యకశిపుఁడు మిగులఁ గోపించి ప్రహ్లాదుని నఱకఁబోయి "నీ వెన్నివిధములబోధించినను శత్రుపక్షమును వీడకున్నావు. నేను నఱకినచో నీకు దిక్కెవ్వరురా?" యనియడుగఁ బ్రహ్లాదుఁడు "దిక్కులేనివారి కెవఁడుదిక్కో యాతఁడే నాకుదిక్కు. నీవు లోకములన్నియు జయించితివిగాని నిమనము జయింపలేకయున్నావు. హరిభక్తిని నీహృదయమునఁ గీలింపుము" అని పలికెను.

రాక్షసరాజు కోపోద్రేకమునొంది ఆహరి నాకంటె నెక్కుడువాఁడా! వాఁడెక్కడనున్నాఁడు, చూపుమన ప్రహ్లాదుఁ డిట్లు అనెను.

క. "ఇందుఁ గలఁ డందు లేఁడని
సందేహమువలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన
నందందే గలఁడు దానవాగ్రణి వింటే."

ఈస్తంభమునఁ జూపఁగలవా యని రాజు గద్దింప "భక్తవత్సలుఁ డెందు లేడు? నీ కిచ్చటఁ బ్రత్యక్షమగు" ననెను.

అంతఁ దండ్రి లేచి అట్లయినచోఁ జూపు మనియఱచేతితో స్తంభము చఱచెను. అందుండి భక్తవత్స

లుఁడగు శ్రీహరి నృసింహరూపమున వెలువడి నఖాగ్రములతో రాక్షసేంద్రునిఁ బట్టిచీల్చి చంపెను. సగము నరమూర్తియు సగము సింహమూర్తి యగు శ్రీహరి రూపము చూచువారలకు మిగుల భయంకరముగా నుండెను.

"భక్తవత్సలా! దుష్టభయంకరా! నృసింహావతారా! భయంకరరూపము విడిచి శాంతస్వరూపము నొందుము" అని ప్రహ్లాదుఁడు నరసింహావతారుని స్తుతించెను. అప్పుడు దేవతలు రాక్షసులు నితరజాతులవారు నెల్లరును బరమేశ్వరుని స్తుతించిరి. అప్పటినుండియుఁ గొందఱు శ్రీహరిని నరసింహరూపునిగా నుపాసనచేయుచుఁ దమసంతతికి నరసింహస్వామి, నరసింహమూర్తి, నృసింహుఁడు, నరసన్న, నరసమ్మ మొదలగు పేళ్లుపెట్టికొనుట యాచారమయినది.

దేవతలు దానవులుఁ గూడఁ బ్రహ్లాదుని ప్రభావము గ్రహించి భక్తితోనుండి యాతని రాక్షసరాజ్యమునకుఁ బట్టాభిషిక్తుని గావించిరి. ఆతఁడు ప్రజాహృదయరంజనమే ప్రధానముగాఁ జేసికొని రాజనామము సార్థకముచేసెను.

రాజులకు సహజముగా నుండెడి మత్తత యాతని నావేశింపలేదు. సమస్తభోగసాధనములున్నను వ్యస

నము నొందక సహజముగానున్న భక్తితో శ్రీహరిపదారవిందలోలుఁడయి కాలము గడపుచుండెను.

"యథా రాజా తథా ప్రజాః" అన్నట్లు ఆతనిరాజ్యమున రాక్షసబృందముగూడ శ్రీహరిసేవాపరులయిరి. ఇతరులమాట చెప్పనేల? ఆతనిప్రవర్తనము మేలుబంతిగా నుంచుకొని ప్రజలు సత్పథసంచరించువారు. ఆతని ప్రవర్తనము భాగవత మాంధ్రీకరించిన బమ్మెర పోతనామాత్యుఁడు రచించిన పద్యములలో విశదమయి యున్నది.

"సీ. తనయందు నిఖలభూతములందు నొకభంగి
సమహితత్వంబున జరగువాఁడు
పెద్దలఁ బొడగన్న భృత్యునికైవడిఁ
జేరి నమస్కృతుల్ సేయువాఁడు
కన్నుదోయికి నన్యకాంత లక్షింబైన
మాతృభావన చేసి మరలువాఁడు
తల్లిదండ్రులభంగి ధర్మవత్సలతను
దీనులఁ గావఁ జింతించువాఁడు
తే. సములయెడ సోదరస్థితి జరపువాఁడు
దైవతములంచు గురువులఁ దలఁచువాఁడు
లీలలందును బొంకులు లేనివాఁడు
లలితమర్యాదుఁడైన ప్రహ్లాదుఁ డధిప."

---

# బుద్ధుఁడు–అహింసాప్రధానుఁడు.



కొందఱు యాగములయందుఁ బశువులబాధించి బలవంతముగాఁ జంపుచుండిరి. దేవతలకు బలియిచ్చుటకు పశువులనేగాక, మనుష్యులనుగూడఁ జంపుచుండిరి. ఆహారమునకై ప్రాణుల హింసించువారి సంఖ్య లెక్కకు మిక్కిలియైయుండెను

దయ నామమాత్రశేషమయియుండెను. మనుష్యులను మనుష్యులే చంపుకొని తినునంతటి కాలము సంభవించెను.

అట్టిసమయమున హింసమానిపించి యహింసాధర్మము నిలఁబెట్టుట కేమహానుభావుఁడో యవతరించుట సహజము. అకాల మిప్పటి కిరువదియయిదువందల సంవత్సరములకుఁ బూర్వము సంభవించెను.

అప్పుడు హిమవత్పర్వతమునకు దక్షిణభాగమునమన దేశమున కుత్తరమునఁ గోసలదేశముండెను. అది యిప్పుడయోధ్యయని వాడుకగల పురమును, దత్ప్రాంతప్రదేశమును. ఆదేశపురాజగు శుద్ధోదనుఁడు కపిలవస్తుపురమున నివసించి ప్రజానుకూలముగఁ బ్రజాపాలనము

చేయుచుండెను. ఆతని కిద్దఱుభార్యలు. మొదటియామె పేరు మాయ. రెండవయామె పేరు ప్రజావతి.

పూర్వకాలపురాజులు బహుభార్యలఁ బెండ్లాడెడి యాచారము గలదు. ఒకరికిఁగాకున్న మఱొక్కరి కయినను సంతానము గలుగు నని వారిలోఁ గొందఱ భావము గావచ్చును. శుద్ధోదనునిభార్య లిరువురయుందును గూడ సంతతి గలుగలేదు. చిట్టచివరకు మాయాదేవి యామెనలువదియైదవ సంవత్సరమున గర్భిణి యయ్యెను.

ఆమె పురుటికై తనపుట్టింటికి వెళ్ళఁదలఁచెను. దానికి భర్తయు ననుమతించెను. ఆమె పుట్టినింటికి వెళ్ళునాఁడు పురమే కాక యామెపుట్టింటివారి యూరికిఁ బోవు మార్గమంతయు నలంకరించిరి. ఆమె పరివారముతోఁగూడ వెళ్లుచుండఁగా మార్గమధ్యమున నున్న మనోహరవనమధ్యమునఁ బ్రసవమయ్యెను. సకలజన మనోహరుఁడగు కుమారుఁడు గలిగెను. శుద్ధోదనుఁడు మహోత్సవములతోఁగుమారునికి సిద్ధార్థుఁ డనినామకరణముచేసెను. ఆరాజకుమారుఁడు శుక్లపక్షచంద్రునివలెఁ దినదినాభివృద్ధి నొందుచుండెను.

విద్యాభ్యాసకాలము వచ్చినతర్వాత విశ్వామిత్రుఁ డనునాతనిని గురువుగా నేర్పఱచి రాజకుమారులు నేర్వవలసిన విద్యలన్నియు నేర్పించెను.

రాజకుమారుఁడు దయాదాక్షిణ్యములతో నెవరి నెట్లాదరింపవలయునో యట్లాదరించుచుండెను. అతని హృదయము నవనీతముకంటె మృదులతరము. ఆదయాస్వరూపుఁడు పరులకష్టములు విని సహింపఁజాలఁడు.

న్యాయపరిపాలనముచేయు రాజు రాజ్యమున దుఃఖకారణములే యుండవు. జనులందఱును సుఖవంతులే యగుదురు. ఎక్కడనయిన దుఃఖమున్నచో, ఆ వార్త రాజభవనములకుఁ జేరనీయరు. అదివిన్న రాజకుమారుల కెక్కడ హృదయమునఁ గలఁక కలుగునోయని రాజకుమారుని యెదుట వచింపకుండ నేర్పాటుచేసిరి. దుఃఖులు, రోగులు, వృద్ధులు వారికంటనే పడరాదు. ఎప్పుడును నిరంతరోత్సాహముతోఁ గాలముగడపుదురు.

సిద్ధార్థుఁడు తగినవయసు వచ్చినతర్వాతఁ దనకుఁదగిన రాజకన్యకను బెండ్లాడెను. ఆమెపేరు యశోధర. వారిరువురును బరస్పరప్రేమతో నానందముగా నుండిరి.

ఒకనాఁడు రథమెక్కి వనవిహారమునకుఁ బోవు చుండ నాతఁ డెప్పుడును జూడని యాకృతితో నొకఁ డాతనికిఁ గనఁబడెను.

కాళ్లు కొంచెము వంకరలయినవి. నడుము వంగి పోయినది. ముగ్గుబుట్టవలెఁ దలనరసినది. ముఖముముడు తలుపడినది కన్నులు సరిగా నానవు. చేతిలోనియూఁత కఱ్ఱ పట్టుతో నడుగులు వేయుచున్నాఁడు. రాజకుమా రుఁ డాతనిజూచి యెప్పుడు నట్టివానిని జూడలేదు గాన వింతపడి సారథితో "అతఁ డెవరు? అట్లున్నాడేమి? మనుష్యుఁడా? వానరుఁడా? ఇతరజంతువా?" అని యెను.

సారథి—అతఁడు మనుష్యుఁడే. వృద్ధుఁ డతఁడు. అవి వార్ధకచిహ్నములు.

రాజ—అవి యేందువలనఁగలుగును? ఎవ్వరికి గలుగును?

సారథి—అవి చిరకాలము జీవించుటచే శరీరమున బలక్షయమయి వచ్చును. దుఃఖపరులకు శీఘ్రముగా వచ్చును. ఎట్లయిననేమి ఎవ్వరికిని దప్పదు.

రాజ—చిరకాలము జీవించితిమేని నీకును నాకు నుగూడ వార్ధకముతప్పదా? నాప్రియురాలగు యశో ధరయు వార్ధకము నందునా?

సారథి—రాజకుమారా ! అది యెవ్వరికిని దప్పదు.

రాజకుమారుఁ డామాటలువిని మనమునఁగొంచెము కలఁతనొంది యుద్యానవనమునకుఁ బోవుటమాని రథము మరలింపు మని యింటికేగెను.

కుమారుఁ డుద్యానవనమున కరుగక వెనుకకు వచ్చుటయు, జరిగినవిషయమును విని తండ్రి మిగుల విచారించి కుమారునిమనము వినోదము నొందుటకై నృత్యగీతాది కాలక్షేపము చేయ నేర్పాటుచేసెను.

ఏమిచేసినను రాజకుమారునిహృదయము మాత్రము ఏదో చింతించుచునే యుండెను.

మఱికొలఁదిదినముల కుద్యానమునకుఁ బోవుచుండఁగా దేహమంతయు ముడుఁచుకొని పులుఁగువలె ధ్వనిచేయుచున్న వికృతాకారము రాజకుమారుని కంటఁబడెను.

రాజకుమారుఁడు—సారథీ ! ఏమది యాపులుఁగట్లుధ్వనిచేయుచున్నది ? దానికి రెక్కలు లేకపోవుట చేతఁ బక్షి కాదని తోఁచుచున్నది.

సారథి—రాజకుమారా ! పక్షి కాదు. మనుష్యుఁడే. వాఁడు దిక్కులేనిపక్షి. అది పులుఁగుకూఁత

గాదు మూలుఁగు. ఏదోరోగమువచ్చి యట్లు మూలు గుచున్నాఁడు. రోగము హెచ్చినపు డట్టిస్వరము గలు గును. ఆరోగము కుదురునదిగాదు. కొంచెముసేపులోనే వాఁడు చచ్చును.

రాజ—చచ్చునా? చచ్చుటయనఁగా?

సారథి—ఈశరీరమునందలి ప్రాణవాయువులు ఎప్పుడో యొకప్పుడు పోవుట. అవి మరల దిరిగిరావు. ఆదేహము వట్టి కట్టెవలెనుండును.

రాజ—ఎట్టివారికి ప్రాణవాయువులు పోవును?

సారథి—ఎట్టివారికైనను బోవును.

మహారాజైనను మహాదరిద్రుఁడయినను, పం డితుఁడయినను, పామరుఁడయినను,పుణ్యాత్ముఁడయి నను, పాపాత్ముఁడయినను, సుకుమారుఁ డయినను, కఠినుఁ డయినను, ఆస్తికుఁ డయినను. నాస్తికుఁ డయి నను, సదాచారి యయినను, దురాచారి యయినను, ఎవఁడయినను, చావునకు లోనుగావలసినదే. అదియే మృత్యువు. మృత్యువునకుఁ బక్షపాతము లేదు. సకల ప్రాణులను సమముగాఁజూచును. చంపివేయును.

రాజకుమారుఁడు—అమ్మో! అందఱకును తప్ప నిదా?

సారథి—మృత్యు వందఅకును వచ్చును.

రాజ—(తలయెత్తిచూచి) అదేమి కఱ్ఱలమీఁదఁ గట్టి యేదో తీసికొని పోవుచున్నారు. వెంటవచ్చుచున్నవా రేడ్చుచున్నా రేమి ?

సారథి—అదే ప్రాణముపోయిన దేహము. అదే శవము. దానిని గట్టి తీసికొనిపోవుచున్నారు. ఆప్రాణి తమ్ము నెడఁబాసి పోయెనని బంధుజనమును మిత్రులును నేడ్చుచున్నారు.

రాజ—ఆతఁడు నిద్రపోవుచున్నట్లున్నాఁడే.

సారథి—అదే పెద్దనిద్ర. ఇంక మెలఁకువరాదు.

రాజ—ఆదేహ మేమిచేసెదరు?

సారథి—అది కఱ్ఱలనడుమున నుంచి తగులఁబెట్టెదరు.

రాజ—అహా ! దేహ మిట్టిదని తెలిసియు నెంత మోసపోవుచున్నాము. చాలుఁ జాలు. విహార మేల ? యింటికి రథము మరలింపుము. అని రథముమీఁద నింటికిఁబోయెను..

అదిమొదలు సిద్ధార్థునకు సర్వదా యేదో యాలోచన మనము నాక్రమించెను. దేహమునందు విరక్తిగలిగెను. ప్రపంచమంతయు దుఃఖమయముగాఁ గనఁబడెను.

మఱియొకనాఁడు కాలక్షేపమునకై వనవిహారమునకు బయలుదేఱి పోవుచుండఁగా ఒకఁడు కాషాయవస్త్రములు గట్టుకొని నిర్విచారముగా రథ్యప్రక్క నుండి పోవుచుండ రాజకుమారుఁడు చూచెను.

రాజ—సారథీ! ఆతఁ డెవరు? ఆతనిముఖము చూడ నేవిధమగుదుఃఖమును లేనివానివలెఁ గనఁబడు చున్నాఁడు.

సారథి—ఆతఁడు సన్యాసి. లోకములోని సంబంధము విడిచిపెట్టి నిర్విచారముగా నున్నవాఁడు. ఆతనికిఁ గోరిక లేమియును లేవు. ఆపూటకు దొరకినభిక్షాన్నముతో శరీరమును నిలఁబెట్టుకొనువాఁడు.

రాజ—అట్టిజీవనమే సుఖజీవనము. అట్టివాఁడు గాక మిగిలినవారందఱును దుఃఖులే. అదే నాకు బాగుగాఁ దోఁచినది. నేఁటి కింటికిఁబోవుదము. రథము మరలింపుమని యింటికిబోయెను.

అంత రాజకుమారుఁ డొంటరిగానుండి యిట్లు తలపోసెను. ప్రాణులకు మరణముతప్పదా? ఆబాధ తప్పకున్నను బ్రతికియున్నంతకాలమయినఁ బ్రజలకు రోగాదిబాధ తప్పింపఁజాలనా? అయ్యో! ప్రజలెంత దుఃఖములో మునిఁగియున్నారు! వారిదుఃఖము తప్పించు

నుపాయ మేదైనను గనిపట్టి యత్నించెదను. ప్రజల బా
ధలుతప్పింపఁజాలకున్నచో నాకు రాజనుపే రేల? ఇట్లు
కొంతకాలము విచారించుచు సరియగుమార్గము గాంచ
లేక విసువుసెంది తనరాజ్యమందును తనదేహమునందు
ను విరక్తి గలిగియుండెను.

అంతఁ గొంతకాలమునకు సిద్ధార్థునకుఁ బుత్రుఁ
డు గలిగెను. శుద్ధోదనుఁడు పౌత్రుఁడు గలిగె నని
మహానందమున మహోత్సవము చేయించుచుండెను.

ఆ పుత్రోత్సవవార్త సిద్ధార్థునకుఁ దెలియ నా
తఁ డానందింపలేదు సరిగదా, సంసారమున మఱియొక
బంధము గలిగెనని యెంచెను.

పుత్రోత్సవకాలమందలి విశేషోత్సవము లన్ని
యును నాతనికి విపరీతముగాఁ దోఁచినవి. అచటనుం
డుటకుఁ గూడ నాతఁ డిష్టపడలేదు. ప్రజల కవి సంతో
షప్రదముగా నున్నవిగాని యాతనికిమాత్రము దుఃఖ
ప్రదములుగాఁ గనబడెను.

ఒకనాఁ డర్ధరాత్రిమున రాజకుమారుఁడు తా
నరణ్యమునకుఁ బోఁదలచి పాదచారియై పోయినచో,
ప్రజ లడ్డువచ్చెదరని యెంచి సారథిని గుఱ్ఱమును దెమ్మ
నెను. సారథి గుఱ్ఱమును సిద్ధముచేసి తీసికొనివచ్చుటకుఁ

బోయెను. అతఁడు గుఱ్ఱమువచ్చునంతలో దనభార్యా పుత్త్రులను జూచి పోవఁదలఁచి లోపలి కరిగెను.

యశోధర శిశువును గౌఁగిలించుకొని హంస తూలికాతల్పమునఁ బరుండియుండెను. సిద్ధార్థుఁ డామె చేయితీసి పిల్లవాని నెత్తికొనఁదలఁచి, యామెచేయి తాఁకినచో నామెకు మెలఁకువ వచ్చునేమో యామె యరణ్యప్రయాణమునకుఁ బ్రతిబంధ మగునేమో యని స్పృశింపకయే తిరిగివచ్చి సిద్ధముగా నున్న గుఱ్ఱమెక్కి యొకనదీతీరము చేరి గుఱ్ఱము దిగెను.

అతఁడు తనతో వచ్చుసారథికి గుఱ్ఱమునప్పగించి తనయాభరణములన్నియు నిచ్చి వెనుకకుఁ బొమ్మనెను. సారథి తానుగూడ వెంటవచ్చెదనని యెన్నివిధములఁ గోరినను అనుమతింపక "నాతల్లిదండ్రులకు నాభార్యకు నామిత్రులకును నేనుసన్యాసము స్వీకరింపఁబోవుచున్నా నని చెప్పు"మని వెనుకకుఁబంపి తాను ముందుమార్గము నుబట్టి పోవుచుండెను. అతఁడు మార్గమధ్యమునఁ గనఁబడిన సన్యాసికిఁ దనవస్త్రములిచ్చి యాతనికాషాయము పుచ్చుకొని సన్యాసివేషముదాల్చి రాజగిరియను పురమున కరిగి సన్యాసిధర్మములతో సంచరించి యచట నుండు రాజునాదరమునకుఁ బాత్రుఁడయ్యెను.

ఆరాజు యాగమున యథాపూర్వముగాఁ బశు హింససేయుఁబోవ సన్యాసి యహింసాధర్మ మాతనికి బోధించి పశుహింస మాని పించెను.

ఆతఁడు కొంతమందిపండితులతోఁ గలసికొని వారివలనఁ గొన్నివిషయములు విని తన భావములను వారి కెఱుఁకపఱచెను. తుదకు ఉద్రేకుఁడను బ్రాహ్మణునివలన వేదాంతశాస్త్రమంతయు విని యచటనుండి యిపుడు బుద్ధగయ యనఁబడు ప్రదేశమునకుఁ బ్రాంతముననున్న యరణ్యమునకుఁ బోయి కొంతకాలము తపస్సుచేసి శరీరమును గృశింపఁజేసెను.

తుదకదియంతయు వ్యర్థమని యెంచి శుష్కోపవాసవ్రతాదులవలన శరీరమును బలహీనముచేయుట తాను నివసించు గేహము గూలఁజేసికొనుటవంటి దని నిర్ణయించెను. "సర్వందుఃఖం దుఃఖమ్. సర్వంక్షణికం క్షణికమ్" అనుట నిశ్చయము. ఈదుఃఖనివారణమార్గము కనిపట్టి యెల్లరకుఁ బ్రకటించుట నాకు విధి యని బుద్ధికిఁ దోఁచిన ధర్మము లాతఁడు బోధించెను. వానిలో ముఖ్యములయినవి గొన్నిమాత్ర మివి.

(౧) "పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్" పరోపకారమే పుణ్యకారణము. పరపీడయే పాప

మూలము. తాను చేసిన పాపమునకు ఫలము తా ననుభ వింపవలెను. అదియే దుఃఖము. పరోపకారము చేయుట వలన ఆపాపము క్షీణించును. పాపక్షయమయినచోఁ దాను సుఖవంతుఁడగును.

(౨) జీవహింస చేయరాదు. నిన్ను హింసించిన యెడల నీ కెంతబాధయో నీవు హింసించినచో నెదుటి ప్రాణికి నంతబాధయే యుండు ననుకొనుము. ప్రతిప్రాణి యందును దయయుండవలయును.

(3) మూర్ఖుఁ డెవఁడయినను ద్వేషముతో నిన్ను జంపవచ్చినప్పుడు వానిపైని ద్వేషము దెచ్చుకొనకుము. వానిని ప్రేమతో నాదరింపుము. దానిచే నాతని ద్వేష ము నశించును. నీవు ద్వేషముపూనితే వానిద్వేషము పెరుగును. నీ వప్పుడు వానిని లొంగఁదీయలేవు. నీవు శాంతివహించితివేని వానిద్వేషము హెచ్చలేదు. చివ రకు నిల్వఁజాలదు.

(౪) శత్రువులను జయింపఁజూడకుము. మొదట నిన్ను నీవు జయించుకొనుము.

(౫) సత్యమే పలుకుము.

ఆసిద్ధార్థునికి సత్యమగు ధర్మములు బుద్ధమగుటచే నాతఁడు బుద్ధుఁడని ప్రసిద్ధినొందెను. ఆతఁడు సన్యాసి

రూపముతోఁ దనపురమునకు వెళ్ళి తల్లిదండ్రులకును భార్యాపుత్రులకును తన పరివారమునకును తన మతము బోధించి వారిని పిడిచిపెట్టి దేశసంచారము చేయుచుండెను.

అతఁడు దేశభాషలోఁ దన మతసిద్ధాంతములు బోధించుటయే గాక శిష్యప్రశిష్యబృందముచే బోధింపించెను. కావుననే సర్వజనసామాన్యముగా దేశమందంతటను బౌద్ధధర్మములు వ్యాపించెను. కొందఱు ప్రత్యక్షముగా బౌద్ధుల మని చెప్పికొనకపోయినను బౌద్ధధర్మములను తమజీవితమున ననుసరించి ధన్యులయిరి. ఈమతము ద్వీపాంతరములకుఁ గూడ వ్యాపించెను.

పెక్కండ్రు మాంసాహారము వర్జించిరి. నరబలులు జంతుబలులును జాలభాగము నశించినవి. యాగములందు గొందఱు పశువులకుమాఱు పిండితోఁ బశువుల విగ్రహములు చేసి వానిని హింసించి దానితోఁ దృప్తినొందిరి. ఇదియే పిష్టపశువు. ఈయాచారము మాధ్వమతావలంబులలో నిప్పటికిని గలదు. శ్రాద్ధాములందు మాంస ముపయోగించు పద్ధతి బ్రాహ్మణులలోఁ గూడ నుండెడిది. అదియే పలపైతృకము. అది పూర్తిగా

నశించినది. అహింసయే పరమధర్మ మని యందఱును గ్రహించిరి.

ఆబుద్ధుని బౌరాణికులు అవతారపురుషులలో నొకనిగా నెంచి పూజించుచున్నారు.

---

## మాలదాసరి.

(గుణము ప్రధానముగాని కులము ప్రధానముగాదు.)

చెప్పరానికుల మనివాడుక గలచండాలకులమున నొకదాసరియుండెను. అతఁ డుండుమాలపల్లికి మూఁడామడదూరమున నొకయడవిలో నొకగుడి యుండెను. అతఁడు తెల్లవాఱకముందే కోఁడికూఁత విని లేచి యాగుడిదగ్గఱకుఁ బోయి భగవంతుని గుఱించి పాటపాడుచుండెడివాఁడు.

ఒకరాత్రి యర్ధరాత్రిముననే పిల్లియొకటి కోళ్ళగూఁటిలోఁ దూఱెను. కోళ్లన్నియును గలవరపడి కూసినవి. మాలదాసరి తెల్లవాఱవచ్చిన దని యనుకొని యథాప్రకారము గుడికిబయలుదేఱెను. కొంతదూరము వెడలినతర్వాత దారితప్పెను. పోఁగాఁ బోఁగా వెలుగు వచ్చుటకు ముందే యొకపాడువడినయూరు చేరెను.

ఆ యూరి ప్రక్కనుండి యొకదారి కలదు. ఆదారినిబట్టి పోఁగా నచ్చట నొకపెద్దమఱ్ఱిచెట్టు కనఁబడెను.

ఆమఱ్ఱిమీఁద భయంకర మగురూపుతో నొక రాక్షసుఁ డుండెను. అతనిని దాసరి చూచియు ముందు గుడికిఁ బోవలయు ననుతొందరతోఁ దనదారిని దాను బోవుచుండెను.

ఆరాక్షసుఁడు పోనిచ్చునా? పోనీయ లేదు. "నిన్ను నేను జూచినాను పోకుపోకు" మని కేక వేసెను. దాస రి యాఁగక పోవుచుండఁగా రాక్షసుఁ డాఁగవా యని దాసరిని నిలిపెను. దాసరియు రాక్షసునకుఁ దగినవాఁ డే గాన వానిని ద్రోసివైచి పోవుచుండెను. రాక్షసుఁడు తనయాజ్ఞలోనున్న పిశాచస్త్రీలను బిలిచి వారిసహాయ ముతో వాని నాఁపివేసెను.

అతఁడు చేయునది లేక వారికి లొంగిపోయెను. పశువులనకుఁ ద్రాళ్లు గట్టి పడఁగొట్టునట్లు వానిని బడఁ గొట్టి సన్నవినరములతోఁ బేనినత్రాళ్లు గట్టిరి.

అంత దాసరి రాక్షసునితో నిట్లనియెను. "అ య్యా! రాక్షసా! నామనవి యొకటి వినుము. నీ కింతతొందర యేల? నీకు నేను పాత్రిలో సిద్ధముగా నున్నయాహారమనే గదా. ఎక్కడకుఁ బోఁగలను?

నాప్రాణము దక్కించుకొని పోవుటకుఁ జెప్పుచున్నా నని యనుకొనకుము. ప్రాణరక్షణము ప్రతిప్రాణికిని సహజమే కాని నా కీదేహమం దంతయపేక్ష లేదు. తెవులుచేతనో, తేలుకుట్టియో, నీటిలోఁబడుటచేతనో నిప్పంటుకొనుటచేతనో యేదోయొకవిధమున దేహము తప్పక నశించును. అట్టిదేహము నాఁకలిగొనునీవంటివాని కాహారముగా నుపయోగింప నిచ్చుట యెంతధన్యత ?

నీవు క్రూరమృగమవు గావు. తిర్యగ్జంతువవు కావు మావలెనే నీకును గాలుసేతులు గలవు. అన్నట్టు మరచిపోయి యంటిని. మాకంటె మీకే కరచరణాదుల బలమును విజ్ఞానమును నెక్కువగా నుండును. రుచియా? శుచియా? మలమూత్రములతో నిండిన మానవశరీరము భక్షింపఁగోరుదువా ? అదియైనను ప్రాణిహింస చేసినఁగాని లభింపదుగదా. దానివలన మహాపాపము మూటగట్టుకొనెదవు. మానవులము మాకు నేఁడే చావుసంభవించు ననుకొనుము. నీకుమాత్రము చావు తప్పునా ? ఏనాఁటికైనను దప్పదుగదా. అప్పుడీపాపఫల మనుభవింపకతప్పదు గదా.

రాక్షసుఁడు—ఓదాసరీ ! నీ వెన్నిమాటలు చెప్పినను నేను నిన్ను విడువను. నీయాటలు నాదగ్గఱఁ

బనికిరావు. ఈనీతులు నాకును దెలిసినవే. వీనినిబట్టి నోటికి సిద్ధమైన తిండి యెవఁడు మానుకొనును.

దాసరి—రాక్షసా! మంచిదే. నామాటలలోని తప్పు క్షమింపుము. నామనవి యొకటి వినుము. నేఁజెప్పఁ బోవు మాటలవలన నీకాహారముగాకుండఁ దప్పుకొని పోవ యత్నించుచున్నా నని యెంచకుము. నాకొక వ్రత మున్నది. అదేమనిన ?

ఈసమీపమున నున్న గుడిదగ్గఱకుఁబోయి ప్రతి దినమును భగవన్నామము గానముచేసి వచ్చుట యల వాటు. అదియేగదా ముందుజన్మమున నుపయోగించు నది.

రాక్షసుఁడు—దాసరీ! మొన్నటివఱకును దా రులుగొట్టుచునే యున్నావు. నేఁటికి దాసరివైతివా? అందును వైష్ణవము ముదిరినది. మమ్ము మోసముచేసి పోఁదలఁచుచున్నావా? గట్టివాఁడవురా!

దాసరి—రాక్షసోత్తమా! నిన్ను మోసముచే యను. పాటపాడివచ్చి నీకాహారమ నయ్యెదను. ఒట్టు పెట్టుకొనెదను.

రాక్షసుఁడు— ఒట్టులకేమి లే. లోకములో నో టిదగ్గఱ నున్న తిండి విడిచిపెట్టువాఁడెవఁడు? నన్నుఁ

దిను మనివచ్చి తనదేహ మిచ్చువాఁ డెవఁడు? రెంటును నసంభవములే. వట్టిమాటల కేమి?

దాసరి—నామాట నమ్ము. నాదేహము నీకాహారముగా నిచ్చెదను. అ ట్లీయనియెడల నిదిగో నాశపథము వినుము. "నారాయణునితో సరియగు దేవుఁడు గలఁ" డని చెప్పుపాపాత్ముఁడు పోవునరకములకుఁ బోవుదును. సత్యముదాఁటను.

రాక్షసుఁడు—కానిమ్ము. శీఘ్రముగ రమ్ము. చూతము నిసత్యము. లేకపోయినచో నప్పుడే యున్నవి నీపాట్లు. ఎక్కడకుఁ బోఁగలవు? వెళ్లిరా.

అప్పుడు దాసరి సంతోషముతో వెళ్ళి పాటపాడి తిరిగివచ్చి రాక్షసా! ఇదిగో నాదేహము. ఇది తిని నీ యాఁకలిదీర్చికొనుము. ఆకాళ్ళే, ఆచేతులే, ఆతలయే, చూచుకో మోసమున్నదేమో, మార్పుగాని మాయ గాని లేదుగదా.

రాక్షసుఁ డాతని జూడఁగానే యాశ్చర్యపడెను. ఆతనిమాటలు వినఁగానే రాక్షసునిమనస్సు మారిపోయెను.

రాక్షసుఁడు—(దాసరికి నమస్కారముచేసి) దేవతలుగూడఁ బ్రాణాపాయమువచ్చునపుడు సత్యమును

విడిచెదరు. నీవంటిమహానుభావు నెక్కడను జూడ లేదు. సత్యవ్రతమునసే కాదు, ధైర్యమునను భగవద్భక్తియం దును నీకు సాటిలేరు. ధన్యుఁడవు.

దాసరి—నీదయవలన నేకదా నేను నేఁడు ధన్యుఁ డనైతిని. కష్టపడి సంపాదించుకొనినయాహారమును విడుచుట యెంతకష్టము. నీకు విలంబమయినది. ఆఁకటి చే నీకడుపు నకనకలాడుచున్నది. శీఘ్రముగ నాదేహ ము భక్షింపుము. నాదేహమున మాంసమును గ్రొవ్వు ను సమృద్ధిగ నున్నవి. నీయాఁకలి దీర్చుకొనుము.

రాక్షసుఁడు—(తనలోఁ దాను జాలనొచ్చుకొని) భాగవతోత్తమా! ఎంతకాలమునుండియో యీపాడుదే హము నిలఁబెట్టుకొనుటకై యెందఱనో చంపి తినుచు న్నాను. అప్పుడప్పుడు కొంచెము జ్ఞానముగలిగి యెంతపా డుజన్మమెత్తితినని దుఃఖించుచుందును. ఏనాఁటికయినను భక్తుఁడెవఁడయినను వచ్చి నన్నుఁ దరింపఁజేయఁడా యని యాలోచించి యాలోచించి తుదకు సహజమైనరా క్షసకృత్యమే చేయుచుందును. నేఁటికి నీవు దొరకితివి. నేఁడు నీవు పాడినపాటవలనిఫలము నాకిమ్ము. దానిచే నా కీపాడుజన్మము నశించును. నీవా సుఖముగా నీయిం టికిఁ బోవచ్చును. నీదేహ మియ్యనక్కఱలేదు.

దాసరి—నీ కట్టిమాట యెన్నఁడును నేనియ్య లేను. నా దేహము నీ కాహారముగా నిచ్చెద నంటిని. అది పుచ్చుకొనుము. నా పాటఫలమెన్నఁడును నీయను. ఈ పాడుదేహము కాపాడుకొనుటకు నా పాటఫల మిచ్చెద ననుకొంటివా ? ఇట్టిదేహము లెన్నిపొందలేను. ఎన్ని విడువలేను. ఎన్నిపర్యాయములు రాజులమై పుట్టలేదు. ఎన్నిపర్యాయములు దాస్యముచేయువారమై పుట్టలేదు. ఎన్నిమార్లు ఛాందసులమై పుట్టలేదు. ఎన్నిసార్లు చండాలురమై పుట్టలేదు. విష్ణుభక్తులమై మాత్రము పుట్టుట దుర్లభము. అట్టిస్థితిలో భగవన్నామము గానముచేసిన ఫలము తుచ్ఛదేహము రక్షించుకొననిమ్మనెదవా ?

రాక్షసుఁడు—నీ దేహరక్షణమునకుఁ గాదు. నన్ను రక్షించుటకు, నా పాడుజన్మము పోఁగొట్టుటకు నిన్ను వేఁడుచున్నాఁడను. ఎంతమంది మహానుభావులు మంత్రరహస్యములుగూడఁ దెలిపి యెందఱను నావంటివారలను దరింపఁజేయలేదు. ఎవరిమాటయో యెందులకు. రామానుజులవారు గురువు వలదన్నను శ్రీరంగశిఖరమెక్కి యెల్లరకును వినిపించునట్లు భగవద్గీతారహస్యము బోధింపలేదా? దానిపైని గురువు కోపింపఁగాఁ “దమయాజ్ఞ మీఱినందులకు నేను నరకమును బొందెదను. ప్రజల

యందలి జాలిచేఁ దమ రుపదేశించినట్లెల్ల ప్రజలకు నుప దేశించితిని. వారు తరించిన నాకుఁ జాలును. అనిపలుక రామానుజులవారిగురువు సంతసించి దానికంగీకరింప లేదా? ఇట్టి దృష్టాంతములెన్నియో కలవు. నీవు పాడినపాటలోఁ జివరపాదమును బాడినఫల మిమ్ము. నిన్ను శరణమొందితిని. (అని పాదములపైని పడెను.)

దాసరి—కానీ! లెమ్ము. నీపశ్చాత్తాపమువలననే నీపాపము నశించిపోయినది. నీవుకోరినగాన ఫలమునకేమి? నీ కీదేహ మెట్లుకలిగినది? పూర్వజన్మమున నీ వెవరవు? తెలుపుము.

రాక్షసుఁడు—నాపూర్వజన్మ వృత్తాంతము వినుము.

నేను చోళదేశమున నుండు నొకబ్రాహ్మణుని కుమారుఁడను. అప్పుడు నాకు "సోమశర్మ" యని పేరు. వేదములును శాస్త్రములును సర్వమును గురువులయొద్ద నేర్చికొంటిని. ప్రతిపండితునితోడను వాదములుచేసి నావాదమే నెగ్గిన దని నెగ్గనప్పుడుగూడఁ బట్టుదలతోఁ బలుకుచుండువాఁడను. నేను మహావిద్వాంసుఁడ నని చిల్లరిరాజులు భ్రమపడి నాకుఁ దగినన్ని బహుమానము లిచ్చుచుండువారు. ఎట్లయిననేమి ద్రవ్యము సంపాదించు

చుంటిని. యాగములు చేసినవారిని గొందఱను జూడఁగా యాగము చేయవలెనని బుద్ధిపుట్టి యావంకతోఁ గొంత ద్రవ్యము సంపాదించుటకై మధురాపురమునకుఁ బోయితిని. అక్కడ వెలిలో నున్నవారికి స్వల్పప్రాయశ్చిత్త మేర్పఱచి పవిత్రులనుజేసి వారితోఁ దినుచుండువాఁడను. ఇదియది యన్నమాటయేమి? పట్టరాని దానములు పట్టుటకు నేనే సిద్ధుఁడనయి యెట్లో కొంతద్రవ్యముగూడఁబెట్టితిని.

ఆసొమ్ము కోమట్లకు బదులిచ్చి దానికి వడ్డికట్టి పెంచుచుంటిని. బియ్యము, బట్టలు దొరికినపుడా కోమట్లకు వెలకు నిచ్చి యాసొమ్మునకును వడ్డిపెంచుచుంటిని. వడ్డికట్టుటలోను, సరకులకు వెలకట్టుటలోను తగవులు వచ్చుచుండెడివి. అవి నలువురు వినవలసివచ్చినప్పుడు విన్నవాఁడు కాఁబోలు. ఒకదొంగ నాసంగతి సందర్భములు గనుపెట్టి చూచుచుండెను. అది యప్పుడు నేను గ్రహింపలేక పోయితిని. తర్వాతఁ దెలిసినది.

అట్లు కొంతకాల మైనతర్వాత స్వదేశమునకుఁ బోవలయు నని బుద్ధిపుట్టి నాభార్యకు మంచిమంచి చీరలు కొన్నాను. కొత్తచెప్పులజోడును నింకను మఱికొన్నింటిని గొంటిని. అదియంతయును నాదొంగ కనుపెట్టి

చూచుచునే యున్నాఁడు కాఁబోలు. ఆరాత్రి ప్రయాణ మని తోడివారును మేమును ననుకొన్నమాటలను బట్టి ప్రయాణసమయమునకు దొంగ కాచికొనియే యుండెను.

ఆరాత్రి ప్రయాణముమీఁదిదృష్టిచేత గాఢ ముగా నిద్రపట్టలేదు. ఆసగముసగము నిద్రలో "ఉత్త రముత్తరము. ఉత్తర దిక్కుగా రండి. ఇదితోవ" అని కేక వినిపించినది. అది విని నిద్రనుండి మెలఁకువఁదెచ్చి కొని లేచితిని. మఱికొందఱు మార్గస్థులును నక్కడఁ బరుండియుండిరి. వారును లేచిరి. అందఱము కలసిపో వుచుంటిమి. నామూట యొకశిష్యున కెత్తితిని. ఆదొంగ కూడ మార్గస్థునివలెనే సంచియొకటి బుజముపై వైచు కొని ముందుముందు నడచుచు "రండి యిదే తోవ" యనుచుఁ బోవుచుండెను.

కొంతదూరము పోగా నొకవాఁగుదగ్గఱకుఁ బో యితిమి. అప్పుడు కొంచెము వెలుఁగు వచ్చుచున్నది. చేతిలోని రేఖలు గనఁబడుచున్నవి. అంతలో నొక మూలనుండి బాణములు, నొకమూలనుండి ఱాళ్లనుబడి నవి. మార్గస్థులు ముందునకుఁ బరువెత్తిరి. ఇంకను ముందునకుఁ బోవ సందే కనఁబడలేదు. అందఱును

గలవరపడుచుండిరి. కొందఱు దొంగలనెదుర్కొనఁబూని దెబ్బలు తినిరి. కొందఱు దగ్గఱ నున్నసొమ్మంతయు నిచ్చి "మమ్ములను గొట్టకుఁడు. ఆఁగువారి నంటకుఁడు." అని పలుకుచుండిరి. నేను నామూట తీసికొని వచ్చు శిష్యునిగూడ విడిచి ప్రక్కప్రక్కల కొదిఁగి తప్పించుకొని పోవుచుంటిని. అంతలోనొకఁడు కత్తితోఁ గాళ్ళకొంకులమీఁదఁగొట్టినాఁడు. దానితోఁబడిపోయినాను. నాబొజ్జ యెత్తుగానుండుట చూచి నాపంచె యూడఁదీసెను. నే నంతకుముందు రహస్యముగా బట్టలోపలఁ గట్టినవరహాలమూట తీసికొని, చెవులుఁ ద్రెంపి, చెవులనున్న పోగులు లాగుకొని, కుళ్ళాయి దోఁచికొని పోవుచుండెను.

అయిన దేదియో యయిన దని నే నూరకుండరాదా? నోటిశని యూరకుండనీయదు. నాసమీపగ్రామమున బ్రతికి యెంతపని చేసితివిరా? ఈసొమ్ము నీకు దక్కునఁటరా ? కానీరా ! అంటిని.

ఆమాటలమీఁద వాఁడు నేను రాజుతోడనో రడ్డితోడనో చెప్పుదు నని భయపడి నన్నుఁజంపినగాని యిబ్బంది కలుగు నని పోట్లు పొడిచిపొడిచి, పైప్రజ యెవరో వచ్చుటచూచి పాఱిపోయెను.

అంతలో నాప్రాంతమందుండు పెద్దదారిని బోవు ప్రజలు మేముపడుచున్నపాట్లు విని వచ్చుచుండిరి. వారిలో నాబావమఱఁది యొకఁ డుండెను. అతఁడు నాయవస్థచూచి మిగుల విచారించి లేవలేని నన్నుఁ గావటి బుట్టలో నుంచి మోసికొనిపోవుచుండెను. అట్టి కష్టసమయమునఁగూడ నాతఁడు నన్నుఁ బరిహసించుచు నొక యూరికిఁ గొనిపోయెను.

అచ్చటివైద్యుని బిలిపించి కత్తిదెబ్బలకు విడిపోయినచోట్లనంటఁ గుట్టియుఁ గఱ్ఱదెబ్బలకుఁ బగిలిపోయిన తలపయినున్నసందులలో గుడ్డమసి పెట్టి కట్టుకట్టియుఁ గొంచెము గంజిపోసియు మాబావ నాకుపచారములు చేయించెను. అక్కడనుండి మాయూరికినన్నుఁ దీసికొని పోవుచు మాబావమఱఁది నన్నిమఱ్ఱిచెట్టునీడనుదింపెను.

అంతలో నాకు జ్వరమువచ్చెను. నన్నుఁ గొట్టిన వానివేషము నాకనులకుఁ బొడకట్టెను. నాకంతకాలమువచ్చెను. ఆదేహమువిడిచిపెట్టుసమయమున నాకన్నులకును మనస్సునకు నాభయంకరాకారము, ఆవికృతవేషము ప్రత్యక్షమైనట్లుండెను. మఱియొకదృష్టియే లేదు. కావుననే నా కీవికృతరాక్షసరూపము గలిగినది. నీగాన

ఫలదానమున దీనిని మానుపుము. ఇదినావృత్తాంతము. ఈపైనినీదయ.

దాసరి—ఫలము నే నెఱుఁగను. ఫలముపరమేశ్వరసంతుష్టియే. దానికి ఫల మింత. అందునీవింతపుచ్చుకొమ్మనఁ జాలను. నిన్నుఁ బరమేశ్వరుఁడే రక్షించును, ఊఱడిల్లుము. అని దాసరి పలుకునంతలో వానికి రాక్షసరూపము పోయి బ్రాహ్మణరూపమేగాక విష్ణుభక్తుని రూపముగూడఁ గలిగెను.

నెత్తిపయిని శిఖయు, భుజములకైన యజ్ఞోపవీతమును, లలాటమున నూర్ధ్వపుండ్రములును, వక్షస్థలమునఁ దులసిపూసల తావళమును, జేతిలో ద్రావిడప్రబంధమఃన్నగ్రంథమును, బహ్మవర్చస్సును, భాగవతలక్ష్మియు ముఖమునఁ దాండవమాడఃచుండ సోమశర్మ ధన్యుఁడాయెను.

ఆభాగవతబ్రాహ్మణుఁడు మాలదాసరికి నమస్కరించి పూజగావించి "గాయకసార్వభౌమా! భక్తాగ్రేసరా? నన్నుఁ బవిత్రుని గావించితివి. బ్రాహ్మణ్యమిప్పించితివి. భగవద్భక్తుని గావించితివి. నీయెదుట నేను నిలఁబడుటకుఁగూడ నర్హుఁడనుగాను. సత్యదయాధర్మములును, భక్తియు నెవనికుండునో యాతఁడే పూ

ణ్యాఁడు. ఆతఁ డేకులమునఁ బుట్టిన నేమి ? నీవు పుట్టుటచే నీకుల మాతయుఁ బవిత్ర మయినది. ఇంక నట్టి పవిత్రకులమును జెప్పరానిది, యాంటరానిది, యనుట మహాపాపకారణము. అని స్తుతించి యింటికిఁ బోయినచో భార్యాపుత్రాదులతో ననుబంధము గలుగు నని తీర్థయాత్రల కేగెను. ఆదాసరియు యథాపూర్వముగా భగవన్నామము గానముచేయుచు లోకుల నెల్లరను ధన్యులఁ జేయుచుండెను.

---

# లోకమాన్య బాలగంగాధరతిలకు.

---

(మహావిద్వాంసుఁడు.)

మహారాష్ట్రదేశమున రత్నగిరియను గ్రామమునందు రామచంద్రతిల కను పేరుగల గొప్పపండితున కొక కుమారుఁడు జన్మించెను. అతని కే బాలగంగాధర తిలకను పేరు. క్రీస్తుశకము 1856 వ సంవత్సరమున జూలయి నెలలో నిరువదిమూఁడవ తేది యామహానుభావుఁడు జన్మించిన సుదినము.

అతనికిఁ బదియాఱవ వత్సరము వచ్చునప్పటికి నతనితండ్రి కాలధర్మమునొందెను. బాలగంగాధరుఁడు తన పినతండ్రిసహాయమున నాంగ్లవిద్య నభ్యసించి పట్ట పరీక్షయందును క్రమముగ న్యాయవాదిపరీక్షయందును గూడఁ గృతార్థుఁడయ్యెను. సంస్కృతమందును మహారాష్ట్రమునందును గొప్పపాండిత్యమును సంపాదించెను అతనికి వేదవిద్యయం దాసక్తి యధికముగా నుండెను. గంగాధరుఁ డేదేని గొప్పయుద్యోగము చేయఁగలఁ డని కొందఱును, న్యాయవాదిగాఁ బనిచేసినచో లక్షలకొలదిధనము సంపాదింపవచ్చు నని కొందఱును ననుకొనుచుండిరి. తిలకుహృదయమున కారెండును గూడ రుచింపలేదు. ఉద్యోగమని పేరుపెట్టి యొకనియొద్దఁ బని చేయుట సేవకవృత్తియని దానియందనాదరముగలిగెను. సేవావృత్తి శ్వవృత్తియేగదా. న్యాయవాదివృత్తి నేతిబీరకాయవంటిది. పేరుమాత్రమే కాని యొకప్పుడయిన నన్యాయవాదమున కావశ్యకత గలుగక మానదని యెంచినాఁడుకాఁబోలు. కష్టపడి ధనము వ్యయముచేసి చదివి పరీక్షలో ధన్యతఁగాంచియు నది వృత్తిగాఁ గొనలేదు.

అతనిహృదయమున సర్వజనసామాన్యమగు నూహాలుగాక కొన్ని విశేషమయినయూహాలు గలవు. చివరకు విద్యాదానము చేయుచుఁ దనభావబీజములను విద్యార్థిహృదయక్షేత్రములఁ జల్లినచో నవి యంకురించి పెరిగి ఫలింపవచ్చునని యెంచి దానికనుకూలమగు నుపాధ్యాయవృత్తి నవలంబింప నెంచెను. తుదకుఁ గొంతమంది మంత్రుల సహాయమునఁ బూనానగరమందు నొక యాంగ్లపాఠశాలను స్థాపించి దానిలోఁ దానొక యుపాధ్యాయుఁడుగా నుండెను. "ఏవృత్తియు లేనపు డుపాధ్యాయవృత్తి" యని సర్వసామాన్యముగా ననుకొనెదరు కాని యది మిగులఁ బవిత్రమగువృత్తి. ధనముసంపాదింప నవకాశముగలవిద్యయు వృత్తియుఁ జేతిలోనున్నను మనతిలకు సర్వమును బరిత్యజించి యుపాధ్యాయవృత్తి నవలంబించెను. స్వయముగాఁ బాఠశాలను స్థాపించిన మహానుభావుఁడు. గురువులలో నొకఁడుగా నుండుట విద్యార్థులయదృష్టమే కదా? అట్టిగురువు పఠనీయగ్రంథపాఠముతోపాటు సత్ప్రవర్తనము, దేశభక్తి, సర్వసంప్రదాయజ్ఞానము గలుగునట్లు బోధించి విద్యార్థులను ధన్యులఁగావించును. బోధకతచేతను బాండిత్యముచే

తను, సత్ప్రవర్తనముచేతను విద్యార్థుల హృదయముల నాకర్షించి విద్యాబుద్ధులు వారికిఁ గఱపుచుండెను.

ఆపాఠశాల క్రమముగాఁ గళాశాలయయ్యెను. అదియే "ఫెర్గూసన్" కళాశాల. ఆమహావిద్వాంసుఁడు ప్రజలకుఁ గొంతప్రబోధముఁ గలిగింపఁదలఁచి "మహారాట్టా" యను పేరుగలపత్రికను నాంగ్లభాషలోను "కేసరి" యనుపేరుగలపత్రికను మహారాష్ట్రభాషలోను నడపుచుండెను. అవి దేశభక్తిని, ధైర్యస్థైర్యములను స్వాతంత్ర్యమును బోధించుటలో ముఖ్యమైనవిగా నుండెను. అతఁడు క్రమముగా రాజకీయవిషయముల లోఁ బనిచేయుచుండెను.

అంతలో దేశమున మహాక్షామ మలవరించినది. దానికిఁదోడు ప్లేగురోగము ప్రజానాశము చేయుచుండెను. అట్టిసమయమున మానవసేవ ముఖ్యమని యెంచి వైద్యశాలను స్థాపించుటయేగాక, ప్లేగు అంటురోగమయినను భయపడక, స్వయముగా వెళ్ళి, రోగులకు మందిచ్చి చికిత్సచేయుచుండెడువాఁడు.

మేడలమీఁదనో యుపన్యాసవేదికలమీఁదనో యుండి పెద్దపెద్దమాటలు చెప్పువారే కాని గంజికాఁచుకొనుటకు బియ్యపుగింజలు దొరకక బాధపడు దరి

ద్రులకు నెవరు నెట్టిసహాయమును జేయరైరి. అట్టిస్థితి లోఁ దిలకుమహానుభావుడు బియ్యపుఁ బుదుకాణములు గొన్ని పెట్టించి కొంచెము చౌకగా నమ్మించుచుండెను. అది కొంతవఱకుఁ బ్రజలకు సహాయమయినది.

ఇట్టి లోకవ్యవహారాదులతో నామహానుభావు నకు నొకక్షణమయినను దీరిక లేకయుండెను. అతనిహృ దయమునమాత్రి మేనాఁటికయినను వేదవిద్యలు పరి శీలించి యందలివిషయములను వెల్లడింపవలయునని తీ వ్రమయినవాంఛగలదు. దాని కవకాశముమాత్రము లభింపకయుండెను.

అంతలోఁ గొన్ని రాజకీయవ్యవహారసందర్భ ములనుబట్టి తిలకుమహాశయుఁడు కారాగృహమునకు బంపఁబడెను. అట్టివారికిఁ జెఱయయినను నిల్లయినను నొకటియే. హృదయమున విచారమున కవకాశమే యుండదు. పైపెచ్చు తిలకు లోకవ్యవహారమునుండి విరమించి వేదవిద్యా విచారణచేయుట కవకాశము గలి గినందులకు సంతసించెను. కారాగారమున నున్నంతకాల మును వేదవిద్యలోని గూఢవిషయములు ప్రత్యేకగ్రం ధముగా రచియించెను. అతఁడు గణితశాస్త్రమునందు ను, సంస్కృతమునందును గొప్పపండితుఁడు గాన ఖగో

శస్థితి ననుసరించి వేదకాలము మున్నగువిషయములను బోధించు నొక గ్రంథమును రచియించెను. దానికి "ఓరియన్" అని పేరు.

అది జగత్త్రయము వ్యాపించినది. జర్మనీదేశమున జన్మించి మన వేదముల కన్నిటికి నాంగ్లమున ననువాదము చేసిన మహాపండితుఁడు "మాక్సుమిల్లరు" దొరగారు. ఆయనను మనలోఁ గొందఱు "మోక్షమూలభట్టారకుఁ"డందురు. ఆమహావిద్వాంసుఁడు గంగాధర తిలకు గ్రంథమును జూచి యాతని వేదవిద్యాపరిశీలనకు గణితశాస్త్రపారీణతకు నాశ్చర్యపడి తిలకనఁగా సరస్వతీవిగ్రహమే యని యెంచెను. అతఁడట్టి విద్యామూర్తి చెఱలోనున్నాఁడని తెలిసి మిగుల దుఃఖించి యింగ్లాండునకుఁబోయి యప్పటి చక్రవర్తినియగు విక్టోరియారాణితోఁదిలకుమహానుభావతనుబ్రకటింప నామెదయతోఁ దిలకునకుఁ గారాగృహవాసము తప్పించెను. అనేకమహాపండితులు తిలకును వేయినోళ్ళఁ బొగడుచుండిరి.

మరల నాతఁడు దేశసేనచేయుచు నుండెను. వేదవిద్యావిచారణమున కంతయవకాశమే లేకుండెను. మఱియొక సందర్భమున నాతఁడు మరలఁ గారాగృహమునకుఁ బంపఁబడెను. అప్పుడు భగవద్గీతలు ప్రధాన

ముగాఁ బఠించి "గీతారహస్య" మనుపేర భగవద్గీతా గూఢార్థమును మహారాష్ట్రభాషలో రచించి ధన్యుఁడ య్యెను. దానిచే శంకరాదులవంటివాఁ డనవచ్చును.

ఆగ్రంథరాజ మన్నిభాషలలోను ననువదింపఁ బడి ప్రకటితమయ్యెను. ఆంధ్రమునఁ గాకినాడవాస్త వ్యులును, మహాపండితులునగు సోరి సుబ్రహ్మణ్యశాస్త్రు లవా రనువదించిరి.* ఆయన తర్క-వ్యాకరణవేదాంతశా స్త్రములలో గొప్పపండితులు. కాశీపురములోఁ జిరకా లముండి విద్యలునేర్చినవారు. వారికి మహారాష్ట్రాది భాషలలోను నాంగ్లభాషలోనుగూడఁ పాండిత్యముం డెను. ఆగ్రంథము మనదేశమున మిగులఁ బ్రసిద్ధిగా నున్నది. వారుస్వర్గస్థులయిరి.

లోకములో నందఱును గంగాధరుని మిగుల మన్నించుచుండిరి. కావుననే యాతఁడు లోకమాన్యుఁ డయ్యెను. లోకమాన్యగంగాధర బాలతిలకు తనయఱువ దియవయేట శాశ్వతకీర్తిశరీరమాత్రము నిలిపి యశాశ్వ తదేహమును విడచెను. ఆసమయమున దేశములలోని మహాత్ములందఱును దగ్గఱనుండిరి.

---